శ్రీ ర స్తు

# ఆదిత్యహృదయము.




అర్థసహితము

మంగు వెంకట రంగనాథరావు,

గారి వలన; ముద్రించి ప్రకటింప బడినది.





మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

శ్రీవేంకటేశ్వర విద్యాసాగర ముద్రాక్షరశాల.

1914.

వెల 0 — 2 — 0.

శ్రీ రస్తు.




శ్రీమద్రామాయణే, యుద్ధకాండే

ఆదిత్యహృదయస్తోత్రకలిత

సప్తోత్తరశతతమసర్గప్రారంభః

శ్లో ॥ తతో యుద్ధపరిశ్రాంతం సమరే చింతయా
స్థితమ్ । రావణం చాగ్రతో దృష్ట్వా యు
ద్ధాయ సముపస్థితమ్ ॥ ౧ ॥ దైవతైశ్చ స
మాగమ్య ద్రష్టుమభ్యాగతో రణమ్ । ఉ
పాగమ్యాబ్రవీద్రామ మగస్త్యో భగ
వానృషిః ॥ ౨ ॥ *

టీక ॥ తతః - అటుపిమ్మట; రణం - యుద్ధమును; ద్రష్టుం-చూచుటకు; దైవతైశ్చ - దేవతలతోను; సమాగమ్య - చేరి; అభ్యాగతః వచ్చిన; భగవాన్ - అధికమయినమాహాత్మ్యముగల; ఋషిః - జ్ఞానవంతుఁడగు; అగస్త్యః - అగస్త్యుఁడు; యుద్ధపరిశ్రాంతం - పోరునందు అలసినవాఁడును; యుద్ధాయ - పోరుకొఱకు; సముపస్థితం - వచ్చిన; రావణంచ - రావణుని; అగ్రతః - ముందట; దృష్ట్వా - చూచి; సమరే- యుద్ధమునందు; చింతయా -ఆలోచనతో; స్థితం-ఉన్నవాఁడునగు; రామం రాముని; ఉపాగమ్య-సమీపించి; అబ్రవీత్ - పలికెను.

అంత, యుద్ధంబుఁజూచుటకై దేవతలతోఁ గూడవచ్చియున్న భగవంతుఁడును ద్రికాలజ్ఞుండునగు నగస్త్య మహర్షి, రాముఁడు యుద్ధంబున నలసటనొంది, మరల యుద్ధంబునకువచ్చి తనయెదుటనిలు

న్న రావణుంగని, చింతనొంది యుండుటంజూచి, రామునికియుద్ధమువ ష్ట యిట్లుపలికెను. అని . తాత్పర్యము.

రామరామ మహాబాహో శృణు గుహ్యం
సనాతనమ్ । యేన సర్వానరీన్ వత్ససమ
రే విజయిష్యసి ॥ ౩ ॥ ఆదిత్యహృదయంపు
ణ్యం సర్వశత్రువినాశనమ్ । జయావహంజ
పంనిత్యమక్షయ్యం పరమం శుభమ్॥ ౪ ॥ స
ర్వమంగళ మాంగళ్యం సర్వపాపప్రణాశనమ్
చింతా శోక ప్రశమన మాయుర్వర్ధనము
త్తమమ్ ॥ ౫ ॥

టీక॥ రామ-రాముఁడా! రామ-(రాముఁడా రాముడుచింతావిష్టుఁడగుటవలనను ఆదరాతిశయమువలనను కార్యమునందలియుపసరమువలనను రెండుమాఱులు రామసంబోధనము చేయఁబడినది)మహాబాహో పెద్దచేతులుగలవాడా!వత్స-!బిడ్డా యేన- దేనిచేత;సమరే-యుద్ధమునందు;అరీన్-శత్రువులను; సర్వాన్ -అందఱును; విజయిష్యసి- జయింపంగలవో;తత్(అధ్యాహృతము)- అట్టి; గుహ్యం . రహస్యమును; సనాతనం - అనాదియును; పుణ్యం - పవిత్రమును; సర్వశత్రువినాశనం - సమస్తశత్రువుల నశింపఁజేయునదియు; జయావహం - జయముగలిగించునదియు; నిత్యం - నాశము లేనిదియు; అక్షయ్యం - నాశము లేనిఫలముగలదియు; పరమం - అధికమయినదియు; శివం - మంగళకరమును; సర్వమంగళమాంగళ్యం - సమస్తమంగళములకును మంగళమును; సర్వపాపప్రణాశనం - సమస్తపాపములను నశింపఁజేయునదియు; చింతా శోక ప్రశమనం - మనస్సునంకలిదుఃఖమును దేహపీడ బోఁగొట్టునదియు; ఆధివ్యాధులం బోఁగొట్టునదియును; ఆయుర్వర్ధనం - ఆయుస్సునువృద్ధిబొందించునదియు; ఉత్తమం - శ్రేష్ఠమునగు, ఆదిత్యహృదయం - ఆదిత్యహృదయసంబంధియయిన, సూర్యమండలాంతర్యామియయినపురుషుండు ఆదిత్యహృదయ శబ్దము చేతఁ జెప్పఁబడుచున్నాఁడు;యఆదిత్యేతిష్ఠన్; యఆదిత్యమంతరోయమయతి; అంతరాదిత్యేమనసాచరంతం, యఏషోంతరాదిత్యేహిరణ్మయః పురుషోదృశ్యతే, ఇత్యాదశ్రుతులచేఁ జెప్పఁబడిన అంతరాదిత్యవిద్య చేసు పాసింపఁబడునట్టి పరమాత్మయయిన

పరమపురుషుఁడు ఆదిత్యహృదయశబ్దవాచ్యుఁడు, అతనిసంబంధమయిన దనుట: లేక, ఆదిత్యాంతర్యామి యయినపురుషుఁడు, ఆదిత్యహృత్, అనుశబ్దముచేతఁ జెప్పఁబడును, ఆదిత్యహృదంఅయతి - అదిత్యహృత్తు నుబొందునది కావున. ఆదిత్యహృదయమనిస్తోత్రమునకు పేరుగలిగిన ది, ఆదిత్యహృదయమను పేరుగల; జపం - స్తోత్రమును; శృణు - వినుము.

రామా! రామా! మహాబాహుఁడా! నాయనా! నీచేస్తోత్రము జపించినచో సమస్త శత్రువులను యుద్ధంబున జయింపఁగలవో అట్టిపరమ ర హ స్యం బు ను స నా త నం బు ను ప వి త్రంబునుసమస్తశత్రువులనశింపఁ జేయునదియుజయప్రదంబునునిత్యంబునుఅక్షయమైనఫలముగలదియు పరమమంగళప్రదంబునుసమస్తమంగళంబులకునుమంగళంబును, సమస్తపాపనాశనంబునుఆధివ్యాధిహరంబునుఆయుర్వృద్ధికరంబును సర్వస్తోత్రంబులలోను ఉత్తమంబునగుపరబ్రహ్మప్రీతిపాదకమయిన ఆదిత్యహృదయంబనుస్తోత్రమును నీకుపదేశించెదనువినుము. అని, తాత్పర్యము.

రశ్మిమంతంసముద్యంతం దేవాసురనమస్కృతమ్। పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్॥

టీక॥ త్వం(అధ్యాహృతము) - నీవు; రశ్మిమంతం - ప్రశస్తములయిన కిరణములుగలవాఁడును; లేక, రశ్మిమంతం - అంతరంగభక్తులుగలవాఁడును, వారలచేనుపాసింపంబడువాఁడుననుట; సముద్యంతం - చక్కఁగానుదయించుచున్నవాఁడును; దేవాసురనమస్కృతం - దేవతలచేతను అసురులచేతను నమస్కరింపఁబడినవాఁడును; వివస్వంతం - తన తేజస్సుచే నితరములయొక్క తేజస్సులను ఆచ్ఛాదించువాఁడును; భాస్కరం - కాంతులఁజేయువాఁడును, సూర్యుఁడు చంద్రుఁడు అగ్ని మొదలగువానికినిఁగాంతియొసంగువాఁడుననుట, అగు; భువనేశ్వరం - లోకముల యొక్కనాథుని, సమస్తలోకములు నియమించునట్టిసర్వేశ్వరునీ; పూజయస్వ - పూజింపుము, ఈస్తోత్రముచేనారాధింపుమనుట.

నీవు, సువర్ణవర్ణుండగుటచే బ్రశస్తకిరణములుగలవాఁడును (అంతరంగభక్తులచే నుపాసింపఁబడువాఁడును) ఉదయమును బొందుచున్నవాఁడును దేవాసురులచే నమస్కృతుండును ఇతరతేజస్సుల నన్నింటిని

గారిభవించునట్టిమహా తేజస్సుగలవాఁడును, చంద్రసూర్యప్రభృతులకు నుతేజమునొసంగువాఁడునగు సమస్తలోకనియామకుఁడంబరమాత్మను ఇమ్మహాస్తోత్రముచే నారాధింపుము. అని, తాత్పర్యము.

సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీరశ్మిభావనః । ఏష దేవాసుర గణాఀ లోకాఀ పాతిగభస్తిభిః ॥ ౭॥

టీక॥ ఏషః – ఈసూర్యమండలాంతర్వర్తిపురుషుండు; సర్వదేవాత్మకః - సమస్తదేవతలకు ఆత్మభూతుండు. తేజస్వీ । అధికమయిన తేజస్సుగలవాఁడు, రశ్మిభావనః - కిరణములచేత (లోకములను) కలిగించువాఁడు, లేక, అంతరంగభక్తులను ముక్తులుగాఁజేయువాఁడు. ఏషః - ఈతండు; దేవాసురగణాఀ - దేవాసురసమూహములను; లోకాఀ - లోకములను; గభస్తిభిః - కిరణములచేత; పాతి- రక్షించుచున్నాఁడు ఆదిత్యమండలాంతర్వర్తియగు నీపురుషుండు, సమస్తదేవతలకు నాత్మభూతుండు, తనతేజస్సుచే సమస్తతేజస్సులనుదిరస్కరించువాఁడు: కిరణంబుల సమస్తలోకంబులకు ఉత్పత్తిస్థితిసంహారంబులు సేయువాఁడు (భక్తులకుమోక్షంబునొసంగువాఁడు), ఈతండె, కిరణంబుచేవర్షాదులు గల్గించి దేవాసురప్రభృతి సమస్తలోకంబులనురక్షించును. అని తాత్పర్యము.

ఏషబ్రహ్మాచ విష్ణుశ్చ శివ స్స్కందః ప్ర
జాపతిః । మహేంద్రో ధనదః కాలో య
మ స్సోమో హ్యపాంపతిః॥ ౮॥

టీక॥ ఏషః - ఈతఁడు; బ్రహ్మాచ – చతుర్ముఖుఁడును; విష్ణుశ్చ- విష్ణువును - శివః - శివుండును; స్కందః – కుమారస్వామియు; ప్రజాపతిః - బ్రహ్మాదిప్రజాపతులును; మహేంద్రః - దేవేంద్రుండును; ధనదః – కుబేరుండును; కాలః - మృత్యువును; యమః - యముఁడును; సోమః - చంద్రుఁడును ("హి" అనునది పాదపూరణార్థము); అపాంపతిః- వరుణుండును.

ఈతఁడే, సమస్తదేవతలను శరీరముగాఁగలవాఁడు; ఇతఁడె బ్రహ్మ, ఇతఁడె విష్ణువు, ఇతఁడేశివుండు, ఇతఁడేకుమారుఁడు, ఇతఁడేనవప్రజాపతులును, ఇతండెదేవేంద్రుండును. ఇతఁడెకుబేరుండును, ఇతఁడేమృత్యువు, ఇతఁడెయముఁడు, ఈతఁడె చంద్రుఁడు; ఇతఁడె వరుణుండు. అని,

తాత్పర్యము.

విశేషార్థము.—పూర్వశ్లోకమునందు సర్వదేవాత్మకత్వము చెప్పఁబడినది, అదియిప్పుడు వివరింపఁబడుచున్నది. "యఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే" (సూర్యునియందులోపల హిరణ్మయుఁడయినయేయీపురుషుఁడు చూడఁబడుచున్నాఁడో) అని శ్రుతియందుఁబరమయోగులచేఁ జూడఁబడువాఁడుగాఁ జెప్పంబడుటం జేసి, పురోవర్తివాచకమయినఏతచ్ఛబ్దముచే నిర్దేశము చేయఁబడినది. ఏషః - ఈతఁడు, బ్రహ్మాచ - చతుర్ముఖశరీరుఁడు, చతుర్ముఖాంతర్యామియీతఁడనుట, ఇట్లు ముందును దెలియునది. విష్ణుశ్చ - విష్ణువును; శివః - శివుండును; స్కందః - స్కందిర్ గతిశోషణయోః,, అను ధాతువునఁబుట్టినది, శత్రువులను శోషిల్లఁజేయువాఁడనుట. ప్రజాపతిః - ప్రజాపతిశ్చరతిగర్భేఅంతః (గర్భమునందులోపలఁబ్రజాపతివిహరించును) అను శ్రుతియందుఁజెప్పఁబడినప్రజాపతిస్వరూపుఁడనుట. మహేంద్రః - మహాన్-ఇంద్రః) స్వరూపమునందును ఐశ్వర్యమునందును అవధిలేనివాఁడు. ధనదః - అన్నాదో వసుదః, అనిశ్రుతియందుఁజెప్పఁబడినప్రకారమున సమస్తఫలములనొసంగువాఁడనుట. కాలః - జగత్సంహారము సేయువాఁడు, కాలాయమహాగ్రాసాయవై నమః,, అనిశ్రుతియందును,, అత్తాచరాచరగ్రహణాత్,, అని శారీరకమీమాంసాసూత్రమునందుఁజెప్పబడిన కాలరూపుఁడు. అనాదిర్భగవాన్ కాలః,, అనిపరాశరమహర్షిచేఁజెప్పఁబడినది; యమః శిక్షించువాఁడు, పాపుల శిక్షించువాఁడనుట. సోమః - (అమృతం) సూతే, అమృతమనఁగా మోక్షముదాని నొసంగువాఁడు. అపాంపతిః - జలములకు నాథుఁడు, "ఆపోనారాఇతిప్రోక్తా ఆపోవై నరసూనవః, తాయదస్యాయనం పూర్వం తేన నారాయణస్స్మృతః,, (జలములు నారములని చెప్పఁబడినవి; ఏలయనఁగా, జలములు నరునివలనఁ బుట్టినవి; ఆజలములు ఈయనకు పూర్వము స్థానమయ్యెఁగావున, ఈతఁడు నారాయణుఁడనఁబడెను) అనియు, " అపఏవససర్జాదౌ,, (మొదటజలము నెసృజియించెను) అనియునుండుటవలన, మొదటజలమును సృజియించియందు నివసించినట్టి నారాయణరూపుఁడనుట.

పితరో వసవ స్సాధ్యా హ్యశ్వినౌ మరు
తో మనుః । వాయుర్వహ్నిః ప్రజా ప్రాణ

ఋతుఃకర్తా ప్రభాకరః ॥ ౮ ॥

"ఋతుఃకర్తా,, ఇతిమహేశ్వరతీర్థపాఠః.

టీక ॥ ఏషః(అధ్యాహృతము) - ఈతఁడు, పితరః - అగ్నిష్వాత్తాదిపితృదేవతలు. వసవః - అష్టవసువులు. సాధ్యాః - సాధ్యులు(హి ,, అనునది పాదపూరణార్థము). అశ్వినౌ - అశ్వినీ దేవతలు. మరుతః- ఆవహాదివాయువులు. మనుః - మనువు వాయుః - భూలోకమునందలి వాయువు.వహ్నిః - అగ్ని. ప్రజాప్రాణః- జనులయొక్క ప్రాణము.ఋతుకర్తా - ఋతువులను జేయునట్టి, ప్రభాకరః - సూర్యుఁడు. మహేశ్వరతీర్థ పక్షమునందు, ఋతుః - అందఱిచేతను బొందఁబడునట్టివాఁడు కర్తా - చేయువాఁడు.

ఈతఁడెపితృదేవలు,ఇతఁడెఅష్టవసువులు,ఇతఁడెసాధ్యులు,ఇతఁడెయశ్వినీదేవతలు,ఇతఁడెమరుత్తులు,ఇతడెమనువుఇతడెవాయువుఇతఁడెయగ్ని ఇతఁడె వసంతాదిఋతువులకుఁగారణమయినసూర్యుండు(సమస్తభక్తులచేతన బొందఁబడువాఁడు, సమస్తకార్యములకును బ్రేరకుఁడు,సూర్యుఁడు).అని తాత్పర్యము.

విశేషార్థము.—పితరఃపితృదేవతలు.పితరులయొక్కయునంతర్యామియయినవాఁడనుట, వసవః - (సదావసంతి) ఎల్లప్పుడునుండువారలు ధ్రువోదరస్తథాసోమఆపోవైశ్వానరోనిలః,ప్రత్యూషశ్చప్రభావశ్చః వసవోష్టౌప్రకీర్తితాః,,(ధ్రువుఁడుదరుఁడుసోముఁడుఆపుఁడువైశ్వానరుఁడు అనిలుఁడు ప్రత్యూషుఁడు ప్రభావుండు అని వసువులు ఎనమండ్రుగా జెప్పఁబడినారు). లేక, " అగ్నిశ్చపృథివీచ వాయుశ్చాంతరిక్షంచ ఆదిత్యశ్చద్యౌశ్చచంద్రమాశ్చ నక్షత్రాణిచ ఏతేవైవసవః,, అనుశ్రుతివలన, అగ్నిప్రభృతులు అష్టవసువులు. సాధ్యాః - (సిద్ధిరేషామస్తి) సిద్ధిగలవారలు " మనుర్మంత్రః ప్రాణదశ్చచేతయానశ్చవీర్యవాన్,విత్తిర్జయోనయశ్చైవహంసోనారాయణస్తథా, ప్రభవోథ విభుశ్చైవసాధ్యాద్వాదశజజ్ఞిరే (మనువుమంత్రుండు ప్రాణుడు చేతయానుండు వీర్యవంతుండు విత్తిజయుండు నయుండు హంసుండు నారాయణుండు ప్రభవుండు విభువులని పండ్రెండుగురుసాధ్యులు జన్మించిరి); అశ్వినౌ - ఆడుగుఱ్ఱముయొక్క రూపముదాల్చిన సూర్యభార్యయగు సంజ్ఞాదేవికిని

మగగుణ్ణముచేయుక్క- ద్యాపున్నొందిన, సూర్యునకును బుట్టినవారలు. మనుతః - వాయుపురాణమునందుఁ జెప్పఁబడిన శుక్లజ్యోతిరాదులు నలుబదితొమ్మండుగురు మనుః మననము సేయువాఁడు, నాన్యోతోస్తి మంతా,,(ఇతనికన్న నితరుఁడుమననము సేయువాఁడు లేడు) అని శ్రుతిస్మృష్టికిఁబూర్వము ప్రపంచవిషయక మననముగలవాఁడనుట. వాయుః - (వాతి) సమస్తమును వాసనగలదిగాఁ జేయువాఁడు. వహ్నిః- వహతి (హ. వ్యం) - దేవతల హవిస్సును గొనిపోవువాఁడు, లేక, హుతమయిన హవిస్సును వహించువాఁడు, గ్రహించువాఁడనుట——''ఇష్టాపూర్తంబహుధాజాతం జాయమానం విశ్వంబిభర్తిభువనస్య నాభిః తదేవాగ్నిస్తద్వాయుస్తత్సూర్యస్తదుచంద్రమాః (ఏదిభువనమునకునాభిభూతమయి పుట్టినదియు పుట్టుచున్నదియునగుసమస్తమయిన యిష్టాపూర్తమునుభరించుచున్నదో, అదియేయగ్ని, అదియేవాయువు, అదియేసూర్యుఁడు, అదియేచంద్రుఁడు) అనిశ్రుతి. ప్రజాప్రాణః - ప్రజలకుఁ బ్రాణహేతువు, కోహ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనందోనస్యాత్'' (ఆనందరూపమయిన ఆకాశమనఁగా బ్రహ్మములేనియెడ, ఎవఁడు ప్రాణము గలవాఁడగును?)అని శ్రుతి. ఋతుః - (అర్యతే, పొందఁబడువాఁడు, తెలియఁబడువాఁడు. ''ఋతుస్సుదర్శనః కాలః'' అనిసహస్రనామస్తోత్రము. కర్తా - చేయువాఁడు, సమస్తభూతంబులయందును అంతఃప్రవిష్టుండై సమస్తకర్మలకును బ్రేరకుఁడు ''ధియోయోనః ప్రచోదయాత్'' ఎవ్వఁడుమాబుద్ధులం బ్రేరించునో) అనిశ్రుతి. మఱియు, ''అంతఃప్రవిష్టంకర్తారమేతం, అథరథాన్ రథయోగాన్ పథస్సృజతే, సహికర్తా,సర్వకర్మా,, (లోపలఁబ్రవేశించిన కర్తయగునితఁడే, మఱియురథంబులను రథములతోఁగూడినమార్గములను సృజించును, అతఁడుగదా!కర్త, సమస్తకర్మములుగలవాఁడు.)అనుశ్రుతులునుబ్రమాణములు.ప్రభాకరం ప్రభాం కరోతీ, వెలుతురనఁగాజ్ఞానమును జేయువాఁడు, జ్ఞానమునొసంగువాఁడనుట, ''తేషాంసతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం, దదామిబుద్ధియోగంతం యేనమాముపయాంతితే'' (అట్లు ఎల్లప్పుడును యోగము నవలంబించి, ప్రీతితోనన్ను భజించువారలకు, దేనిచే వారలునన్నుఁబొందగలరో, అట్టి జ్ఞానయోగమును నేనొసంగుదును) అని, భగవద్గీతలు.



శ్రీ ర స్తు.

—( * )—

స్తోత్ర ప్రారంభః.



ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్ । సువర్ణ స్తపనోభానుర్హిరణ్య రేతాదివాకరః ॥ ౧౦॥ "సువర్ణ సదృశో భానుః" ఇతి పాఠాంతరమ్. *

టీక॥ త్వాది - (ఇచటఁ బ్రథమాంతశబ్దములకుఁ బ్రతిశబ్దమునకు ను "త్వం" అనియధ్యాహారము) నీవు; అది త్యః - అదితియొక్క పుత్త్రుఁడవు; లేక, అదితియనఁగా అఖండితమయిన భూమి, దానికినాథుఁడవు; లేక, సర్వం అదత్తే - అన్నిటిని గ్రహించువాఁడవు, యస్మాత్సర్వమాదత్తే తస్మాదాదిత్యః" (ఎందువలన అన్నిటిని గ్రహించుచున్నాఁడో అందువలన ఆదిత్యుఁడు) అనిశ్రుతి, భూమియందలిసమస్తరసమును గ్రహించువాఁడనుట, లేక, జీవరూపంబున సమస్తవిషయంబుల భుజించువాఁడవనుట. సవితా - (జగత్)సూతే, జగత్తునుగలిగించువాఁడవు. సూర్యః - సువతి (జనాన్ కర్మణి) జనులను కర్మయందుఁ బ్రేరించువాఁడవు, ధియో యోనః ప్రచోదయాత్" అనిశ్రుతి. ఖగః-ఖేగచ్ఛతి, ఆకాశమునందిరుగువాఁడవు. లేక, ఖంగచ్ఛతి, దహరాకాశమునుబొందినవాఁడవు, ఉపాసకులచేదహరాకాశమునఁ జూడఁబడువాఁడవనుట. పూషా - పుష్ణాతి, జగత్తునుపోషించువాఁడవు, స్థితికర్తవనుట. గభస్తిమాన్: ప్రశస్తములయిన కిరణములుగలవాఁడవు; లేక, గభస్తియనఁగా సర్వవ్యాపినియగులక్ష్మి, అదిగలవాఁడవు, లక్ష్మీవంతుఁడవనుట. "యథాసర్వగతోవిష్ణుస్తథైవేయంద్విజోత్తమ" (బ్రాహ్మణోత్తముఁడా! ఎట్లు విష్ణువు సర్వమును బొందినవాఁడో అట్లె ఈలక్ష్మియు సర్వమును వ్యాపించియుండును.) అని పరాశరమహర్షి చేఁజెప్పఁబడినది. సుపర్ణః - మంచిపర్ణములు అనఁగా ఱెక్కలు గలవాఁడ

వు, పరమాత్మ యనుట. "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" (ఇద్దఱును పక్షులు కూడనుండువారలును స్నేహితులును) అనిశ్రుతి, జీవాత్మ పరాత్మలను నిర్దేశించుచున్నది. తపనః - తపింపఁ జేయువాఁడవు పాఠాంతరపక్షమునందు, సువర్ణసదృశః - బంగారముతో సమానుఁడవు. "హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః" (బంగారుమీసములు గలవాఁడును బంగారు వెండ్రుకలుగలవాఁడును గోళ్లు మొదలుకొని సమస్తశరీరమును సువర్ణవర్ణము) అనిశ్రుతి. భానుః - ప్రకాశించువాఁడవు. హిరణ్యరేతాః - బంగారువికారమయిన రేతస్సు గలవాఁడవు, కారణమయిన రేతస్సు హిరణ్మయమనుట కార్యము హిరణ్మయమని తెలుపుటకొఱకు, హిరణ్మయమయిన బ్రహ్మాండమును సృజించినవాఁడవనుట, "అప ఏవ ససర్జాదౌ తాసు వీర్యమపాసృజత్, తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభమ్" (మొదట జలములనే సృజించెను, అందు వీర్యమునుంచెను, ఆదిసూర్యసమానమయిన కాంతిగల హేమవికారమయిన యండమయ్యె) అనిమనుస్మృతి. దివాకరః - పగటిని జేయువాఁడవు; లేక, దివాద్యుతింకరోతి, వెలుతురును జేయువాఁడవు; అజ్ఞానమును బోఁగొట్టి జ్ఞానము నొసంగువాఁడవనుట. "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్, దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే," అనిభగవద్గీతలు.

హరిదశ్వస్సహస్రార్చిస్సప్తసప్తిర్మరీచి<br>
మాన్ । తిమిరోన్మథనశ్శంభుస్త్వష్టా<br>
మార్తాండ అంశుమాన్ ॥

టీక ॥ త్వం (అధ్యాహృతము) - నీవు; హరిదశ్వః - ఆకుపచ్చనివన్నెగల గుఱ్ఱములుగలవాఁడవు; లేక, హరిత్ - హరతి (మనః) మనోహరమయిన, అశ్వః - వాహనములుగలవాఁడవు వృషభగరుడాది మనోహర వాహనములు గలపరమేశ్వరుఁడవనుట. సహస్రార్చిః - వేయి కిరణములుగలవాఁడవు; లేక, అర్చ్యతే ఇతి అర్చిః, అర్చిః అనుట పూజనీయమయిన మంగళగుణము చెప్పఁబడుచున్నది, వేయిమంగళగుణములుగలవాఁడవు, లెక్కకుమీఱిన కల్యాణగుణములు గలవాఁడవనుట. సప్తసప్తిః - సప్తయను గుఱ్ఱముగలవాఁడవు "ఏకో అశ్వో వహతి సప్తనామా" (ఒకగుఱ్ఱము సప్తయను పేరును వహించుచున్నది.) అనిశ్రుతి,

సప్తయనుగుఱ్ఱములుగల యాదిత్యునకంతర్యామియనుట. మరీచిమాన్ - ప్రశస్తకిరణములుగలవాడవు. మిత్రయంతేశ త్రిదశః అనేన - దీనిచేశత్రువులుచత్తురు, అని, మరీచియనఁగాచక్రము, అదిగలవాడవనుట; చక్రముఇతరాయుధోపలక్షకము, శంఖచక్రగదాధరుండ వనుట. తిమిరోన్మథనః - చీకటిని బోఁగొట్టువాఁడవు, లేక, తిమిరమనగా జ్ఞానోత్పత్తి ప్రతిబంధకమయిన దోషము, దాని బోఁగొట్టువాఁడవు, జ్ఞానము గలిగించువాఁడవనుట. శంభుః - శంభవత్యస్మాత్, సుఖముగలిగించువాఁడవు- త్వష్టా - త్వక్షతి, సమస్తనామరూపముల నుసంహరించువాఁడవు మార్తాండః - మృతేఅండేజాతః, బ్రహ్మాండము మృతము కాఁగాబుట్టినవాఁడవు, బ్రహ్మాండము ప్రలయమునొందినపుడు మఱల సృజించుటకై యున్నవాఁడవనుట, లేక, మృతంఅండంజీవయతి, ప్రలయమునొందిన బ్రహ్మాండమును మఱలజీవింపఁజేయువాఁడవు; సృజించువాఁడవనుట. అంశుమాన్ - ప్రకృష్టకిరణములుగలవాఁడవు; లేక,అంశుశబ్దము అంశువ్యాప్తఅనుధాతువునంబుట్టినది,అంశువనఁగావ్యాప్తి,అదిగలవాఁడవు,ప్రపంచములోపల వెలుపలనంతటనువ్యాపించినవాఁడవనుట. అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః ,, (దానినంతయు,లోపలవెలుపలనువ్యాపించి నారాయణుండున్నాఁడు) అనిశ్రుతి.

హిరణ్యగర్భశ్శిశిరస్తపనో భాస్కరో రవిః ।
అగ్నిగర్భోదితేః పుత్త్రశ్శంఖ శ్శిశిరనాశనః ॥ ౧౨ ॥

టీక ॥ త్వం (అధ్యాహృతము) - నీవు; హిరణ్యగర్భః - బంగారువికారమైన అండము గర్భమందుఁ గలవాఁడవు, హిరణ్మయ బ్రహ్మాండమును సృజించినవాడవనుట; ‘‘ అపవవససర్జాదౌ తాసువీర్యమపాసృజత్, తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభం,, అనిమనుస్మృతి; లేక, హిరణ్య - హితమును రమణీయమునుఅయిన, గర్భః - అంతఃకరణముగలవాఁడవు, భక్తులకు మేలొసంగునదికావున రమణీయమయిన హృదయముగలవాఁడవనుట; లేక,హిరణ్య , జీవసమూహము,గర్భః-కడుపున◆గలవాఁడవు.శిశిరః-చల్లనివాఁడవు,తాపత్రయతప్తుల తాపముబోగొట్టిసుఖముగల్గించువాడవనుట,తపనః -తపింపజేయువాడనుట.భక్తులయొక్క శత్రువులకుసంతాపముగలుగజేయువాడవనుట.భాస్క

తః-ప్రకాశముసేయువాఁడవు సర్వవస్తువులను దెలియుటకు కారణభూతుడవనుట. రవిః-రౌతి, శబ్దించువాడవు, వేదములను బ్రహ్మదేవునకుపదేశించినవాడవనుట; యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై "(ఎవఁడు ఆబ్రహ్మదేవునికొఱకు వేదములను పదేశించెనో) అనిశ్రుతి; లేక, రూయతే ఇతి రవిః వేదములచేత చెప్పఁబడు వాఁడవు, లేక, భక్తులచేత స్తుతింపఁ బడు వాఁడవు. అగ్నిగర్భః -పగటియందు అగ్నిగర్భమందుఁగలవాఁడవు, ఉద్యంతం వా ఆదిత్య మగ్నిరనుసమారోహతి' (అగ్ని ఉదయించుచున్న సూర్యునిపొందును) అనిశ్రుతి; లేక, అగ్నిగర్భః - కాలాగ్నిరుద్రుఁడు గర్భమందు గలవాఁడవు; "నారాయణా ద్రుద్రో జాయతే" నారాయణుని వలన రుద్రుఁడుపుట్టును) అనిశ్రుతి. అదితేః - అదితిదేవియొక్క; పుత్రః - కొడుకవు, లేక, అదితిపుత్త్రుఁడవుగా నవతరించినవాఁడవనుట; లేక, అదితేః - అదితియొక్క; పుత్త్రః - పురుషుఁడైనకొడుకును అనగా నింద్రునిరక్షించినవాఁడవు. శంఖః - శామ్యతి, ప్రళయకాలంబున నిర్వ్యాపారముగా శాంతుఁడవగువాఁడవు; లేక, శం ఖే యస్య సః - సుఖము హృదయాకాశమందు గలవాఁడవు, ఎల్లప్పుడును ఆనందముగలవాఁడవనుట. శిశిరనాశనః - మంచును బోఁగొట్టువాఁడవు, సూర్యమండలాంతర్వర్తి యగుటచే సూర్యకిరణంబుల మంచును బోఁగొట్టువాఁడవనుట.

వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుస్సామపా
రగః। ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీథీ ప్లవం
గమః ॥ ౧౩ ॥ *

వింధ్యవీథిః ప్లవంగమః' ఇతి పాఠాంతరమ్.

టీక ॥ త్వం (అధ్యాహృతము) - నీవు; వ్యోమనాథః - ఆకాశమునకుఁ బ్రభుఁడవు, ఆకాశమునందుండు వాఁడవనుట, లేక, ఆకాశమును సృజించినవాఁడ వనుట, "ఆత్మన ఆకాశ స్సంభూతః' (ఆత్మవలన ఆకాశము పుట్టినది) అని శ్రుతి. తమోభేదీ - చీఁకటినిబోఁగొట్టువాడవు, లేక, రాహువును భేదించువాఁడవు, గ్రహణమున రాహువుచే మింగబడి యతని భేదించుకొని వెలువడువాఁడవు, ఆట్టిసూర్యునియంతర్యామివనుట; లేక భక్తులయొక్క తమోగుణమును బోఁగొట్టువాఁడవనుట, ఋగ్యజుస్సామపారగః - ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అను వేదములయొక్క పారమును బొందినవాఁడవు. సమస్త వేద

ములయొక్క పర్యవసానమవు, సమస్త వేదముల చేతను తెలియఁదగి నవాఁడననుట,-"వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః (సమస్త వేదముల చేతను నేనే తెలియఁదగినవాఁడను) అనిశ్రుతి; లేక, ఋగ్యజుస్సామవేదములచేత ఆకాశము యొక్క పారమునొందువాఁడవు" ఋగ్భిఃపూర్వాహ్ణే దివిదేవ ఈయతే, యజుర్వేదేతిష్ఠతిమధ్యేఅహ్నః, సామవేదేనాస్తమనేమహీయతే, వేదైరశూన్యస్త్రిభిరేతిసూర్యః" (సూర్యుఁడు ప్రాతః కాలమున ఆకాశమునందు ఋగ్వేదముచేఁబొందఁబడును. మధ్యాహ్నమునందు యజుర్వేదంబునసునుండును; సాయంకాలమునందు సామవేదముతో మహితుండగును.) అని శ్రుతి. ఘనవృష్టిః - అధికమయినవర్షముగలవాఁడవు; అధికమయినవర్షము గురిపించువాఁడవనుట, "అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యగాదిత్యముపతిష్ఠతే, ఆదిత్యాజ్జాయతేవృష్టి ర్వృష్టే రన్నంతతఃప్రజాః" (అగ్నియందు వేల్వఁబడిన యాహుతిసూర్యునిఁబొందును, సూర్యునివలనవర్షము వర్షమువలనవన్నము, అన్నమువలనఁబ్రజలు గలుగుదురు.) అని స్మృతి; లేక, అధికమయినసర్వకర్మఫలరూపమయిన వర్షణముగలవాఁడవు, "అహంహిసర్వయజ్ఞానాం భోక్తాచప్రభురేవచ (నేనేగదాసమస్తయజ్ఞములకును భోక్తనుబ్రభుండను) అస్మృతి, "ఫలమతఉపపత్తేః (ఉపపత్తివలన, ఈయీశ్వరునివలననెకర్మఫలముగలుగునని సిద్ధమగుచున్నది) అని శ్రీశారీరకమీమాంసాసూత్రము. అపాంమిత్రః - జలములకు స్నేహితుఁడవు, జలములను వర్షించువాఁడననుట, లేక, సముద్రజలంబులశయనించి యుండువాఁడవనుట. వింధ్యవీథీప్లవంగమః, వింధ్యవీథీ - వింధ్యపర్వతముయొక్క మార్గమునందు, అనఁగా ఆకాశమార్గమునందు, ప్లవంగమః - శీఘ్రముగాఁబోవువాఁడవు, లేక, వింధ్యవీథి - వింధ్యవీథివలె దుర్గమమయినసుషుమ్నామార్గమునందు, ప్లవంగమః - శీఘ్రముగాభక్తులనుబోవునట్లు చేయువాఁడవు, భక్తులకు సుషుమ్నామార్గమున మనోవాయుధారణము గలిగి మోక్షముగలుగునట్లు అనుగ్రహము సేయువాఁడవనుట. పాఠాంతరపక్షమందు. వింధ్యవీథిః - దక్షిణాయనమందు) వింధ్యపర్వతము మార్గముగాఁ గలవాఁడవు. లేక, సుషుమ్నామార్గము గాఁగలవాఁడవు, సుషుమ్నామార్గమును బొందినవారలెనినుఁ బొందగలవారనుట.ప్లవంగమః - శీఘ్రముగానడచు

వాఁడవు; లేక, శీఘ్రముగాఁ బొందించువాఁడవు, సమస్తకర్మఫలంబులనుతప్పకయొసంగువాఁడవనుట.

ఆతపీ మండలీ మృత్యుః పింగళ స్సర్వతాపనః
కవిర్విశ్వోమహాతేజారక్త స్సర్వభవోద్భవః॥౧౮॥

టీక॥ త్వం(అధ్యాహృతము) - నీవు;ఆతపీ - ఎండగలవాఁడవు; లేక, ఆసమంతాత్ తపఃఅస్యఅస్తి - మిక్కిలియుతపముఅనఁగాజ్ఞానముగలవాఁడవు. యస్యజ్ఞానమయంతపః" అనిశ్రుతి. మండలీ - గుండ్రమైన ఆకారముగలవాఁడవు; లేక, మండ్యతె అనేనేతిమండలం, అనఁగాభూషణము, అదికలవాఁడవు, కౌస్తుభాదిభూషణములుగలవాఁడవనుట. మృత్యుః - శత్రులఁజంపువాఁడవు. పింగళః - ఉదయకాలమందు గోరోజనపువన్నెగలవాఁడవు; లేక, పింగతి - కలియువాఁడవు, సర్వవ్యాపకుఁడవనుట. సర్వతాపనః - (మధ్యాహ్నమునందు) సమస్తమును తపింపఁజేయువాఁడవు; లేక, ప్రళయకాలమునందే సమస్తబ్రహ్మాండమును సంహరించువాఁడవు. కవిః - పండితుఁడవు; వ్యాకరణము మొదలయిన సమస్తశాస్త్రములను ప్రవర్తింపఁజేసినవాఁడవనుట, లేక, సర్వజ్ఞుఁడవనుట, "యస్సర్వజ్ఞస్సర్వవిత్" అని శ్రుతి. విశ్వః - సమస్తమును నిర్వహించువాఁడవు; లేక, సమస్తమును శరీరముగాఁగలవాఁడవు, "విశ్వమేవేదం పురుషః" అని శ్రుతి. మహాతేజాః - అధికములైనకాంతులుగలవాఁడవు; లేక, అధికమైనయితరుల జయించుసామర్థ్యముగలవాఁడవు. రక్తః - భక్తులయందను రాగము గలవాఁడవు. సర్వభవోద్భవః - సమస్తములైనకార్యములకుకారణభూతుఁడవు; లేక, అందఱి యొక్కయు సంసారమునకు కారణభూతుఁడవు.

నక్షత్రగ్రహతారాణామధిపోవిశ్వభావనః। తే
జసామపి తేజస్వీ ద్వాదశాత్మ న్నమోస్తు తే॥౧౯॥

టీక॥ త్వం (అధ్యాహృతము) - నీవు; నక్షత్రగ్రహతారాణాం అశ్విన్యాది నక్షత్రములకు గ్రహములకు సాధారణ నక్షత్రములకును, అధిపః - నాథుఁడవు; నక్షత్రగ్రహములయందును అంతర్యామి యయినవాఁడవనుట. విశ్వభావనః - ప్రపంచమునునిలుపువాఁడవు;"ద్యౌస్సచంద్రార్క నక్షత్రంఖందిశో భూర్మహోదధిః, వాసుదేవస్యవీర్యేణవిధృతాని మహాత్మనః (స్వర్గము, చంద్రసూర్య నక్షత్రములతో

గూడిన ఆకాశము, దిశలు, భూమి, సముద్రము ఇవన్నియుమహాత్ముం డగు వాసుదేవుని వీర్యముచేతనే నిలిచియున్నవి.) అనిమహాభారతము. తేజసామపి - తేజస్సులకుఁగూడ; తేజస్వీ - అధిక తేజస్సుగలవాఁడవు సమస్తతేజస్సులను అణఁచివేయునట్టి మహాతేజస్సుగలవాఁడవనుట. ద్వాదశాత్మన్ ! పండ్రెండుమూర్తులుగలవాఁడా! ఇందో్రధాతాభగః పూషామిత్రోథవరుణోర్యమా. అంశుర్వివస్వాన్ త్వష్టాచ సవితావిష్ణు రేవచ" (ఇంద్రుడు ధాత భగుఁడు పూషుఁడు మిత్రుఁడు వరుణుఁడు అ ర్యముఁడు అంశుఁడు వివస్వంతుఁడు త్వష్ట సవిత విష్ణువు) అని ద్వాద శాదిత్యులు. ఈ ద్వాదశాదిత్యుల యందు అంతర్యామి యయియుం డువాఁడా! అనుట. తస్మై (అధ్యాహృతము) - అట్టి; తే - నీకొఱకు; న మః - నమస్కారము, అస్తు - అగుఁగాక. నీవుఇట్టివిశేషణములుగల వాడవు, ఇట్టిసమస్తకళ్యాణ గుణములుగల నీకునమస్కారముఁ జేసెదననుట.

నమఃపూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః।
జ్యోతిర్గణానాంపతయేదినాధిపతయే నమః ౧౬।

టీక॥ పూర్వాయ - తూర్పుదిశనుండునట్టి; గిరయే - పర్వతము యిన, తూర్పుకొండ యందున్నదనుట, లేక, తూర్పుకొండయందంత ర్యామివైయున్న; తే(అధ్యాహృతము ఇట్లముందును) - నీకొఱకు;న మః - నమస్కారము. పశ్చిమే - పడమటిభాగమందు; గిరయే - పర్వ తమయిన, పడమటికొండయందుండునట్టిదనుట, లేక, పడమటికొండ యొక్క అంతర్యామివయిన; తే - నీకొఱకు; నమః - నమస్కారము జ్యోతిర్గణానాంపతయే - జ్యోతిస్సమూహములయొక్క నాథుఁడవయిన, లేక, ముక్తులగువారల సమూహములయొక్క నాథుఁడవైన, ముక్తుల కుఁబ్రాప్యస్థానమయిన; తే - నీకొఱకు;నమః (అధ్యాహృతము) - నమ స్కారము. దినాధిపతయే - పగటికిఁబ్రభుఁడవయిన, లేక, పగటినిజే యునట్టి సూర్యునియందుఅంతర్యామివైన; తే - నీకొఱకు; నమః - న మస్కారము,

తూర్పుకొండపైనున్న నీకునమస్కారము; పడమటికొండపైనున్న నీ కునమస్కారము. (తూర్పుపడమటికొండలయందు అంతర్యామివైన నీ కునమస్కారము) జ్యోతిర్గణములకు నాథుఁడవగు నీకు నమస్కారము

(భక్తులగువారలకుఁ బ్రీత్యాస్థానమవగు నీకు నమస్కారము) దినమును జేయునట్టినీకునమస్కారము; (సూర్యమండలాంతర్యామివగు నీకు నమస్కారము) అని, తాత్పర్యము.

జయాయజయభద్రాయ హర్యశ్వాయనమో
నమః। నమోనమ స్సహస్రాంశో ఆదిత్యాయన
మోనమః ॥ ౧౭ ॥

టీక ॥ జయాయ - జయించువాఁడనగు, అప్రతిహతమయిన పరాక్రమము గలవాఁడవనుట; లేక, జయంతిఅనేన సద్భక్తాస్సంసారం (భక్తులు ఈతనిచే సంసారమును జయింతురు) భక్తులనుసంసారమును జయించునట్లు చేయువాఁడవనగు; తే (అధ్యాహృతము) - నీకొరకు; నమః (అధ్యాహృతము) - నమస్కారము. జయభద్రాయ- జయమునుమంగళమునుఇచ్చునట్టి; తే - నీకొఱకు; నమః - నమస్కారము. హర్యశ్వాయ - ఆకుపచ్చనిగుర్రములుగల, ఆకుపచ్చనిగుర్రములుగల సూర్యునియొక్క అంతర్యామివైనయనుట; లేకహరి- మనోహరమయిన, అశ్వ - వాహనముగల, మనోహరమయినగరుడవృషభాదివాహనములుగలవాఁడవనుట; ఇదియాదిత్య మండలాంతర్వర్తిపురుషపరముగ వ్యాఖ్యానించుటంజేసి, యాదిత్యవాచక శబ్దంబులు పలుమాఱు ప్రయోగింపబడినవి; స్తోత్రమవుటవలనను, పునరుక్తము దోషము కాదు. తే - నీకొఱకు. నమఃనమః - నమస్కారము. నమస్కారము.సహస్రాంశో- వేయికిరణములుగలసూర్యునియంతర్యామివైనవాఁడా లేక, మితిలేని తేజస్సుగలవాఁడా వేయిజీవులుగలవాఁడా! సమస్త జీవులు నుసీయొక్క అంశములనుట. 'మమైవాంశోజీవలోకేజీవభూతః', (నాయొక్క అంశమెజీవలోకమందుజీవుఁడయినది. తే- నీకొఱకు; నమోనమః - నమస్కారము, ఆదిత్యాయ - సూర్యుఁడయిన; సూర్యమండలంబునందు అంతర్వర్తివైన; తే - నీకొఱకు; నమోనమః - నమస్కారము నమస్కారము'. నమోనమః, అనిరెండు మాఱులుఆదరాతిశయమునఁ జెప్పబడినది.

అప్రతిహతమయిన పరాక్రమము గలవాఁడవగు నీకునమస్కారము గావించెదను. (భక్తులకుసంసారజయంబునుగల్గించువాఁడవైన నీకునమస్కారము చేసెదను) జయంబును మంగళంబును ఒసంగువాఁడవైన నీకునం

దనముగావించెదను; హరితవర్ణ మగుగుఱ్ఱములుగలసూర్యునియందు నంతర్యామివైన నీకుఁ బ్రణతియొనర్చెదను (మనోహరములగు గరుడ స్వభావ వాహనములుగల నీకు మ్రొక్కెదను.) వేయి కిరణంబులు గల సూర్యుని యందంతర్యామివైనవాఁడా! నీయంశములయిన సమస్త జీవులకు నాధారభూతుఁడా) నీకుఁ బ్రణామంబుగావించెదను; ఆదిత్య మండలంబున యోగులచేఁజూడఁ బడునట్టినీకళ్ఞివందనము చేసెదను. అని, తాత్పర్యము.

నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ
నమోనమః । నమః పద్మప్రబోధాయ
మార్తాండాయనమోనమః ॥ ౧౮ ॥

టీక ॥ ఉగ్రాయ – (ఉపాసకులు కానివారలకు) భయంకర మయిన రూపముగల; తే (అధ్యాహృతము) - నీకొఱకు; నమః - నమస్కారము. వీరాయ - ప్రాణినఃవివిధంఈరయతి. ప్రాణులను నానా విధముగాఁ బ్రేరించువాఁడవైన; తే - నీకొఱకు; నమః- నమస్కారము. సారంగాయ - సారంగచ్ఛతి, శీఘ్రముగానడచువాఁడవైన, అర్ధనిమిషంబునకు సూర్యుడు రెండువేల యోజనంబులుబోవునని పురాణప్రసిద్ధము, లేక, సారమును బొందువాఁడవైన, సారమునుగ్రహించువాఁడవైనయనుట, లేక. ప్రణవమును బొందువాఁడవైన ప్రతిపాద్యుఁడవైనయనుట, లేక, సారంగాయ - హంసావతార రూపుడవైన; తే- నీకొఱకు; నమఃనమః – నమస్కారము నమస్కారము. పద్మప్రబోధాయ - కమలములను వికసింపజేయువాఁడవైన, హృదయకమలమును వికసింపజేయువాఁడవైన; తే, నీకొరకు; నమః - నమస్కారము. మార్తాండాయ – మృతేఅండేజాతః, బ్రహ్మాండము మృతమయినప్పుడు(మఱల సృజించుటకు) పుట్టినవాఁడవైన తే - నీకొఱకు; నమఃనమః - నమస్కారము నమస్కారము.

ఉపాసకులు కానివారలకు భయంకరుడవయిన నీకునమస్కారము; సర్వప్రాణులను తత్తత్పూర్వకర్మానురూపంబుగా గర్మలయందుఁ బ్రేరించువాఁడవయిన నీకునమస్కారము; శీఘ్రముగా నడచువాఁడవయిన (సారమునుగ్రహించువాఁడవయిన, ఓంకారప్రతిపాద్యుడవయిన, హంసావతారరూపుడవయిన) నీకునమస్కారము. కమలములను వికసింపజే

జేయువాఁడవయిన( భక్తులహృదయకమలమునువికసింపజేయువాఁడ వయిన) నీకునమస్కారము; బ్రహ్మాండము ప్రళయము నొందినప్పుడును జల సృజించుటకై యున్న వాఁడవైన నీకునమస్కారము. అని తాత్పర్యము.

> బ్రహ్మేశానాచ్యుతేశాయసూర్యాయాదిత్య
> వర్చసే భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయవపు
> షేనమః ॥ ౧౯ ।

టీక ॥ బ్రహ్మేశానాచ్యుతేశాయ - బ్రహ్మదేవునికిని శివునకును విష్ణువునకును నియామకుఁడవైన; తే - నీకొఱకు; నమః నమస్కారము. సూర్యాయ - ప్రాణులను గర్మములందుఁ బ్రేరేంచువాఁడవైన: తే నీకొఱకు; నమః - నమస్కారము. ఆదిత్యవర్చసే - సూర్యరూపమయిన కాంతి గలవాడవైన; లేక, సూర్యమండలమందుఁ దేజోరూపుడవైన; తే - నీకు, నమః - నమస్కారము. భాస్వతే - తేజస్సు గలవాఁడవైన; సమస్త పదార్థముల యందును తేజస్సుకలిగించువాఁడవైన;యనుట; తే - నీకొరకుఁ నమః - నమస్కారము. సర్వభక్షాయ -సమస్తమునుభక్షించువాఁడవయిన, సర్వమును సంహరించువాఁడవయినయనుట, తే - నీకొఱకు; నమః - నమస్కారము. కావుననే ఆకాలమందు, రౌద్రాయ - భయంకరమయిన, వపుషే - శరీరమయిన,భయంకరమయిన, యాకారము గలవాఁడవనుట; తే - నీకొరకు; నమః - నమస్కారము.

బ్రహ్మవిష్ణు శివులకును నియామకుడవయి పరబ్రహ్మరూపుడవయిన నీకునమస్కారము; సమస్తప్రాణులను అన్యోన్యకర్మంబులందు బ్రేరేంచువాడవయిన నీకునమస్కారము; సూర్యమండలమునందు దేజోరూపుడవయిన నీకునమస్కారము; సమస్త తేజస్సులకును గారణమయిన మహాతేజస్సు గలవాఁడవయిన నీకునమస్కారము; ప్రళయకాలమున సమస్తమును సంహరించువాఁడవయిన నీకునమస్కారము; అప్పుడు భయంకరమయిన యాకారముగలవాఁడవైన నీకునమస్కారము. అని తాత్పర్యము.

> తమోఘ్నాయ హిమఘ్నాయశత్రుఘ్నాయా
> మితాత్మనే । కృతఘ్నఘ్నాయ దేవాయజ్యోతి

పాంపతయేనమః ॥ ౨౦ ॥

టీక ॥ తమోఘ్నాయ - చీకటిని బోఁగొట్టువాఁడవయిన, లేక అజ్ఞానమును బోగొట్టువాడవయిన; తే, నీకొఱకు; నమః -నమస్కారము. హిమఘ్నాయ - మంచునుబోగొట్టువాడవయిన, లేక హిమమనగా శీతము, ఇదియుష్ణమునకు నుపలక్షకము, శీతోష్ణమును బోగొట్టువాడవయిన, భక్తులకుశీతోష్ణాది ద్వంద్వములనునోర్చుశక్తినొసంగువాఁడవయినయనుట, తే -నీకు, నమః - నమస్కారము. శత్రుఘ్నాయ -ఆశ్రితులయొక్క శత్రువులను వధించువాడవయిన, లేక, శత్రుభూతములయిన యింద్రియములను వధించువాడవయిన; ఆశ్రితులకు, ఇంద్రియములని గ్రహించుశక్తినొసంగువాడవయిన యనుట, తే - నీకొఱకు, నమః - నమస్కారము. అమితాత్మనే - పరిచ్ఛిన్నముకాని స్వరూపముగలవాడవయిన, దేశకాలవస్తుకృతత్రివిధ పరిచ్ఛేదము లేనివాఁడవైన యనుట. లేక, అమితమైనమహిమగలవాఁడవైన; తే - నీకొఱకు, నమః - నమస్కారము. కృతఘ్నఘ్నాయ - కృతఘ్నులనువధించు వాఁడవయిన, 'కృతఘ్నులనగా ఇతరులుతమకుఁ గావించిన యుపకారమును మఱచినవారలు, అట్టిమహాపాపులను వధించువాడవైన, ఇది యుపలక్షణము, పాపమునాచరించినవారలనుశిక్షించువాడవై నయనుట తే-నీకొఱకు నమః-నమస్కారము. దేవాయ-దీవ్యతి, సృష్టిస్థితి సంహారములచే గ్రీడించువాడవైన, లేక, ప్రకాశించువాడవయినస్వయంప్రకాశుడవైన యనుట; తే-నీకొఱకు;నమః-నమస్కారము, జ్యోతిషాం-చంద్రసూర్య నక్షత్రాదికములయిన;ప్రకాశవస్తువులకు పతయే ॥ ప్రభుడవయ్యు-చంద్రసూర్యాదిజ్యోతిర్వర్గములకును బ్రకాశమునొసంగువాడవై యనుట; తే నీకొఱకు నమః - నమస్కారము.

అంధకారమునుబోఁ గొట్టువాఁడవయిన ( అజ్ఞానమును బోట్టువాడవయిన ) నీకునమస్కారము, భక్తులకు శీతోష్ణాదిద్వంద్వముల సహించుసామర్థ్యము నొసంగువాడవైన నీకునమస్కారము, ఆశ్రితుల శత్రువులను వధించువాడవైన ( శత్రువులైన యింద్రియములను జయించు శక్తిని భక్తులకు బ్రసాదించువాడవైన ) నీకునమస్కారము దేశకాలవస్తుకృతత్రివిధ పరిచ్ఛేదశూన్యుడవైన (అపరిమితమహిమ,

గలవాఁడవయిన ) నీకునమస్కారము, సమస్తపాపులను, విశేషించి కృతఘ్నులను, శిక్షించువాఁడవయినీకునమస్కారము; సృష్టిస్థితిసంహారముల చేఁగ్రీడించువాఁడవైన (స్వయంప్రకాశుఁడవైన) నీకు నమస్కారము; చంద్రసూర్యాది సమస్తజ్యోతిర్వర్గమునకును బ్రకాశము నొసంగుటచే నాథుఁడవైన నీకునమస్కారము. అని, తాత్పర్యము.

తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే। న
మస్తమోభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే॥

టీక॥ తప్తచామీకరాభాయ - కాఁచఁబడిన బంగారముయొక్క కాంతివంటి కాంతిగలవాఁడవైన; తే - నీకు; నమః - నమస్కారము వహ్నయే - అగ్నిరూపుఁడవయిన, లేక, సమస్తలోకములనువహించువాఁడవైన; హరయే (పాఠాంతరము) - పాపములను హరించువాఁడవైన; తే - నీకు; నమః - నమస్కారము. విశ్వకర్మణే - జగత్తు కార్యముగాఁగలవాఁడవయిన; తే - నీకొఱకు; నమః - నమస్కారము. తమోభినిఘ్నాయ - అంధకారమును బోఁగొట్టునట్టివాఁడవయిన; లేక అజ్ఞానమును బోఁగొట్టువాఁడవయిన; తే - నీకొఱకు; నమః - నమస్కారము. రుచయే - ప్రకాశస్వరూపుఁడవయిన; ఘృణయే (పాఠాంతరము) - ప్రకాశస్వరూపుఁడవయిన; తే - నీకొఱకు; నమః - నమస్కారము. లోకసాక్షిణే - జనులకుసాక్షిభూతుఁడవయిన, సమస్తకర్మలకునుఅంతర్యామివై వారువారుచేయు సమస్తకర్మలకును సాక్షిభూతుడవయినయనుట; తే - నీకొఱకు; నమః - నమస్కారము.

మేలిమిబంగారువంటిమేనుగలవాఁడవైన నీకునమస్కారము; అగ్నిరూపుఁడవైన (సమస్తలోకములకును ఆధారభూతుఁడవైన) నీకు నమస్కారము, (పాఠాంతర పక్షమందు) సమస్తపాపములను హరించువాఁడవైన నీకు నమస్కారము; అంధకారమును నశింపఁజేయువాఁడవైన(అజ్ఞానమును నశింపఁజేయువాఁడవైన) నీకు నమస్కారము; సమస్తమునందును బ్రకాశరూపుఁడవైన(స్వయంప్రకాశరూపుఁడవయిన) నీకు నమస్కారము; లోకులు చేయు సమస్తకర్మములకు సాక్షిభూతుఁడవయిన నీకునమస్కారము. అని, తాత్పర్యము.

నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్ర
భుః। పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః॥ ౨౨॥

టీక॥ ప్రభుః - సమస్తమునకును నియామకుండైన; ఏష వై - ఈమహాపురుషుఁడే; భూతం - జగత్తును; నాశయతి - నశింపఁజేయుచున్నాఁడు. తదేవ - ఆజగత్తునే; సృజతి - సృజించును. ఏషః - ఈతడు; గభస్తిభిః - కిరణములచేత; పాయతి - శోషిల్లఁజేయును, తపతి - తపింపఁజేయును. వర్షతి - వర్షించును.

సర్వలోకనియామకుఁడయిన యీదేవుండే, సమస్తప్రపంచమునుప్రళయకాలంబున సంహరించును, మఱలనాప్రపంచమునె సృజించును; ఈతఁడె, కిరణములచేఁదాపముగల్గించి శోషిల్లం జేయును; వర్షంబునుం గురియించును. అని, తాత్పర్యము.

ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః।

టీక॥ ఏషః - ఇతఁడు;భూతేషు - ప్రాణులు;సుప్తేషు - నిదురించియుండఁగా, పరినిష్ఠితః - అంతటను వ్యాపించినవాఁడై; జాగర్తి - మేలుకొనియుండును.

భూతంబులు నిద్రించియున్నప్పుడును, ఈతండు, ఆభూతంబులయన్నిటియందునుఅంతర్యామిత్వంబునవ్యాపించిన వాఁడై మేలుకొని యుండును. అని, తాత్పర్యము.

ఏష ఏవాగ్నిహోత్రంచ ఫలంచైవాగ్నిహో
త్రిణామ్॥ ౨౩ ॥ *

టీక॥ ఏష ఏవ - ఈతఁడె; అగ్నిహోత్రంచ - అగ్నిహోత్రమను కర్మమును. అగ్నిహోత్రిణాం - అగ్నిహోత్రముగలవారలయొక్క, అగ్నిహోత్రము చేయువారలయొక్క, ఫలంచైవ - ఫలమును.

అగ్నిహోత్రమును అగ్నిహోత్రముయొక్కఫలమును ఈమహాపురుషుఁడే. అని, తాత్పర్యము.

వేదాశ్చక్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవచ।

టీక॥ ఏషః(అధ్యాహృతము) - ఈతఁడు; వేదాశ్చ వేదములును క్రతవశ్చ - యజ్ఞములును. క్రతూనాం- యజ్ఞములయొక్క;ఫలమేవచ ఫలమును.

ఇతఁడె వేదములు, ఇతఁడే యజ్ఞములు, యజ్ఞములచేఁబొందఁదగి

న ఫలమును ఇతఁడే. అని, తాత్పర్యము.

యాని కృత్యాని లోకేషు సర్వఏష రవిఃప్రభుః॥ ౨౪॥

టీక॥ లోకేషు - లోకములయందు; కృత్యాని - కార్యములు; యాని(సంగతి) - ఏవిగలవో, తేషాం( అధ్యాహృతము) - వానికి; సర్వః - సమస్తాత్మకుఁడైన; ఏషః - ఈ; రవిః - సూర్యమండలాంతర్వర్తియగు పురుషుడు; ప్రభుః - నియామకుడు.

మరియులోకంబున నేయేకర్మములు చేయబడుచున్నవో, వానికన్నిటికిని, సర్వాత్మకుఁడయిన సూర్యమండలాంతర్వర్తియగు నీహిరణ్మయ పురుషుఁడేనియామకుఁడును ఫలప్రదాతయు, అని, తాత్పర్యము.

ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయే
షుచ। కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతిరా
ఘవ॥ ౨౫॥

టీక॥ రాఘవ - రాముడా! పురుషః - పురుషుడు; కశ్చిత్ - ఒకానొకఁడైనను; ఆపత్సు - ఆపదలయందును కృచ్ఛ్రేషు కష్టములయందును; కాంతారేషు-అడవులయందును; భయేషుచ - భయములయందును; ఏనం - ఈయాదిత్యహృదయ స్తోత్రమును; కీర్తయన్ - పఠించుచున్నవాఁడై; నావసీదతి - దుఃఖింపబడు.

రాముడా? ఇందుపఠనాశక్తి మాద్యధికారని యమములేదు, ఎవ్వడైనను, ఆపదలుగలిగినపుడుగాని కష్టమువచ్చినపుడుగాని అడవిమార్గంబులంగాని యితరభయంబుగల్గినపుడుగాని యీ యాదిత్యహృదయస్తోత్రమును బఠించినచో నతండు యాపదలంబాసి నిర్భయుండై సుఖము నొందగలడు. అని, తాత్పర్యము.

పూజయస్వైనమేకాగ్రో దేవ దేవం జగత్ప
తిమ్। ఏతత్త్రిగుణితంజప్త్వా యుద్ధేషు విజ
యిష్యసి॥ ౨౬॥

టీక॥ త్వం( అధ్యాహృతము ) - నీవు ; ఏకాగ్రః - ఒకటిచెల్లినమనస్సుగలవాఁడవై ; దేవదేవం - దేవతలకును దేవుఁడును, జగత్పతిం ప్రపంచమునకు నాథుండునగు; ఏనం - ఈదేవుని, పూజయస్వ - పూజింపుము. ఏతత్ - ఈయాదిత్య హృదయమును, త్రిగుణితం - ముమ్మారులుగా, జప్త్వా - జపించి, యుద్ధేషు - పోరులందు, విజయిష్యసి

గెలువఁగలవు.

నీవు- మనసునిశ్చలముగానిలిపి, దేవతలకును దేవుండును జగన్నాథుఁడునగునీదేవుని, యియ్యాదిత్యహృదయస్తోత్రంబునం బూజింపుము, ఈయాదిత్య హృదయస్తోత్రమును మూఁడుమాఱులుజపింతువేని, యుద్ధంబులందుజయము నొందఁగలవు, అనితాత్పర్యము.

అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం
వధిష్యసి ॥

టీక ॥ మహాబాహో - పెద్దచేతులుగల రాముడా? త్వం - నీవు అస్మిన్ - ఈ; క్షణే - క్షణమునందు; రావణం - రావణుని; వధిష్యసి- వధింపగలవు.

మహాబాహుండవగురాముడా! నీవీయాదిత్యహృదయమును జపింపుము, ఈక్షణముననె రావణునివధింపగలవు. అనియగస్త్యుండు రామునకుజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవముక్త్వా తదా ఽగస్త్యో జగామచ యథా
గతమ్ ॥ ౨౮ ॥

టీక ॥ తథా - అప్పుడు, అగస్త్యః, అగస్త్యమహర్షి, ఏవం - ఇట్లు, ఉక్త్వా - పలికి, యథాగతం - వచ్చినట్లుగా, జగామచ - పోయెను.

అంత। నగస్త్యమహర్షి ఇవ్విధంబునంబల్కి, తావచ్చినదారింబోయెను, అని, తాత్పర్యము.

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకో ఽభవ
త్తదా । ధారయామాస సుప్రీతో రాఘవః ప్ర
యతాత్మవాన్ ॥ ౨౯ ॥

టీక॥ తదా - అప్పుడు; మహాతేజాః - అధికమయిన పరాక్రమముగల. రాఘవః - రాముఁడు; ఏతత్ - దీని; శ్రుత్వా - విని; నష్టశోకః - నశించినదుఃఖముగలవాఁడు; అభవత్ - ఆయెను. సుప్రీతః - మిక్కిలియుసంతుష్టుండై, ప్రయతాత్మవాన్ - పరిశుద్ధమయిన మనస్సుగలవాఁడై; ధారయామాస - ధరించెను, ధ్యానముచేసెననుట.

అప్పుడు, మహాతేజుండగురాముండు, ఇమ్మహాస్తోత్రముఁనుపేన్న౦?

స్నాతో, ఆదిత్యహృదయ ప్రతిపాద్యుండగు దేవదేవునిధ్యానించె ని, తాత్పర్యము.

ఆదిత్యం ప్రేక్ష్యజప్త్వాతు పరంహర్షమవా
ప్తవాన్ ।త్రిరాచమ్య శుచిర్భూత్వాధనురా
దాయవీర్యవాన్ ॥ ౨౯ ॥

టీక ॥ వీర్యవాన్-అధికమయినపరాక్రమముగలరాముఁడు; ఆచమ్య - ఆచమనముచేసి; శుచిః - పరిశుద్ధుఁడు; భూత్వా - అయి; ఆదిత్యం - సూర్యుని; ప్రేక్ష్య - చూచి, లేక, సూర్యమండలాంతర్వర్తి హిరణ్మయపురుషుని ధ్యానించి, త్రిః మూఁడునాఁలులు; జప్త్వాతు - జపించియు; ధనుః - విల్లును; ఆదాయ - గ్రహించి; పరం - అధికమయిన; హర్షం - సంతోషమును; అవాప్తవాన్ - పొందెను.

రాముఁడు, ఆచమనముచేసి శుచియయి సూర్యుంజూచుచు(ఆదిత్యమండలాంతర్వర్తియగుపరమాత్మనుధ్యానము చేయుచు,)మువ్మాఱు ఆదిత్యహృదయస్తోత్రమునుజపించి, యనుమడియయినపరాక్రమంబు గలవాఁడై, పరమహర్షంబునొంది, ధనుస్సుచేతఁబట్టెను అని, తాత్పర్యము

రావణంప్రేక్ష్యహృష్టాత్మా యుద్ధాయ స
ముపాగమత్ । సర్వయత్నేనమహతా వధేతస్య
ధృతోభవత్॥ ౩౦॥

టీక॥ సః (అధ్యాహృతము) - ఆరాముఁడు; రావణం - రావణుని; ప్రేక్ష్య - చూచి; హృష్టాత్మా- సంతోషించిన మనస్సుగలవాఁడై; యుద్ధాయ - పోరుకొఱకు, పోరుటకనుట; సముపాగమత్ - సమీపించెను. మహతా - గొప్పదగు; సర్వయత్నేన - సమస్తప్రయత్నముచేత; తస్య - ఆరావణునియొక్క; వధే - చంపుటయందు; ధృతః- నిశ్చయించినవాఁడు; అభవత్ - అయ్యెను. రాముఁడు, అంతరావణుంజూచిసంతుష్టుండై, సమస్తప్రయత్నంబుల నతనివధింపనిశ్చయించియుద్ధంబుసేయుటకై, సమీపించెను. అని, తాత్పర్యము.

అథ రవి రవద న్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః
నిశిచరపతిసంక్షయం విదిత్వా